అంకితము:

ప్రియమిత్రుడు, సహృదయుడు, దేశహితాభిలాషి

అగు

# అన్నె సంజీవరావు గారికి

*

ఏదో విచార భారము మొయిన్ తపియించెడు నా యెడందలో
బాదుకొనంగ జేసినవి భాసిత దివ్య వికాస శాతముల్
నీ దరహాసచంద్రికలు నీ మృదువాక్కులు మిక్కుటమ్ముగా
మోదము మీర గైకొనుము ముందిడినాడను కావ్యకన్యకన్

# పోషకులు

ఘంటా బుల్లెయ్యగారు (ఎక్సు ఛైర్‌మన్, తెనాలి)

యలవర్తి రా॥ కు॥ పిచ్చయ్యగారు, కూచిపూడి

యలవర్తి లక్ష్మీనారాయణగారు, కూచిపూడి

యలవర్తి చల్లయ్యగారు, కూచిపూడి

యలవర్తి వేంకటరత్నముగారు, కూచిపూడి

కుడితిపూడి వీరరాఘవయ్యగారు, బేతపూడి

యలవర్తి వేంకటకృష్ణయ్యగారు, కూచిపూడి

లంకా వెంకటేశ్వర చౌదరిగారు, వేమూరు

తుమ్మల ధనంజయగారు, యలవర్రు

గోగినేని వెంకటసుబ్బయ్యగారు, కూచిపూడి

కొత్త రాజబాబయ్యగారు, సంగంజాగర్లమూడి

వాసిరెడ్డి శివలింగయ్యగారు, కంతేరు

# బీదరాలు

ఆమె ఒక మహా సాధ్వీలలామ—ఆస్య
సీమ దొల్కాఁడుచున్నవి స్ఫీతరుచులు
వికసిత నవకుశేశయ విసరవిమల
దీధితీ తతి సైతంబు ధిక్కరించి.

చెలుల సర్వసర్వంసహా చక్రనివసి
తాఖిలానూన చంద్రబింబాననాని
సహజ విలాస సౌందర్యముల్ వమ్ము సేయు
నామె ధావళ్య మంజులోద్దామకాంతి.

అవని నొక రాజ్ఞితో నైన యగును ఆమె
తరళనేత్రాబ్జ నిర్యాత ధవళకమ్ర
పృథుల రోచులు దిననాథ విపులచండ
కిరణ సంభూత కాంతులఁ గ్రేణిసేయు.

ఆ యమ మహా పతివ్రత, అతుల శాంత
మొలుకుచున్నది వదనాన, ఉరువిశాల-
గండమండల సంజాత గాఢ కాంతి
అరయ శశిధర బింబంబు నవఘళించు.

కడగి బ్రహ్మాండభాండమ్ము గలచి వేయు
జాలు విస్తృత తేజంబు సరవి ముగ్ధ
విమల దేహోద్గతంబయి వెలుగుచుండు
నిఖిల సముదీర్ణ సద్రుచుల్ నివ్వటిల్ల.

కాని పరమేష్ఠి ఐశ్వర్యహీన జేసి
దుర్భరనిర్వృతి నోడ్త్రోన దొడర జేసి
నాడు — ఒక అనాఘ్రాణిత నవ్యసుమము
భంగి గణియింప బడదయ్యె వసుధ నువిద.

ఒక మహోజ్జ్వలంబగు శక్తి యుత్కటముగ
వెల్లివిరియుచు నున్నది వెలది యంతః
కాని ఆమె అనాదృత ఆత్మతలాన
ఆమె బరికించు వారలే అవని లేరు.

ఆమె లోకైకరాజ్ఞియే అనగ నగును,
ఉద్ధురాస్తోకవిస్ఫూర్తి ఉరువడించి
కడలుకొను భూనభంబుల, కాని లోక
మామె గన్నెత్తియైనను అరయబోదు
అతుల నిర్వృతియె సంప్రాప్త మగుటజేసి.

*

ఈ నవ మౌక్తికావళిని
నెన్నగ మిన్నగ గ్రేణిసేయు నీ

మానిని దివ్యదంతతత
మానిత సాంద్రవినూత్నరోచులున్
గానల నేచి పూచి కడు
క్రమసుసౌరభ మీను సూన సం
తానము భాతి భూస్థలి వృ
ధా యగునేగద చూడగన్ గటా !

# ఆంధ్రపుత్ర

అరివీర దుర్వార కరవాల వారాల
దుత్తునియలు జేయు దోర్బలంబు;
శుంభదారంభ సంరంభగుంభాయుత
హస్తి కుంభాలనే అణచు శక్తి;
పృథులానిలోద్వేల వేగాల నిందించు
ఘోటకంబుల ధాత్రి గూల్చు నేర్పు;
దుర్భరనిర్భేద్య దుర్గవర్గంబులన్
దుర్దాంత శౌర్యశక్తి దూల్చు కడిమి;

స్రోదినీసముత్తుంగ తరంగసంఘ
ములను నిస్తరించి వితత భూరిధైర్య
పటిమ నన్యదుర్గాలనే వశ మొనర్చు
నతుల శౌర్యంబు నెందేగ ఆంధ్రపుత్ర !

ఈ ఆంధ్ర సీమలో నెనలేని రాజ్యాల
నెలకొల్పినారు నీ తెలుగు వారు
తమ విశదయశంబు దందడించుచు నుండ
అఖిల దిగంత సంహతుల యందు ;
అస్తోకజన్యాల నరివీరనికరంబు
చిలుకుమార్చిరి గదా తెలుగు దొరలు
తమ విస్ఫురద్బాహు దర్పోన్నతశ్రీల
నగ్గించు చుండంగ నవని యెల్ల ;

తరళ సందీప్త సంఘాతభరిత మగుచు
ఆంధ్ర విక్రాంతి దేశాల నలమె నాడు
శీర్య మైనట్టి నీదగు శౌర్య మెల్ల
ఆవటింపుము వేవేగ ఆంధ్రపుత్ర !

తెలుగు వీరుడు జేరి తీండ్రింప గదనాన
వెనుజూపి పాఱరే వీరవరులు !
తెలుగు నృపాలుండు దీపింప, రహిఁ బాసి
ప్రత్యర్థి వైళంబ పల్లటిలఁడె!
తెల్గు శూరుల వెల్గు తీవ్ర కృపాణముల్
తరళింప దలరదే పరబలంబు !
తెలుగు మన్నీడు కన్నులు జేవురింపగ
ధృతిని దొఱంగరే ధీరవరులు !

తెలుగు దొర హుంకరించిన గలగ బడదె
ఇలయు నిట్టలంబగు నిట్టి తెలుగు తేజ
మకట! యెటువోయె! నే మూల నడగిపోయె
అరయు మికనైన వేవేగ ఆంధ్రపుత్ర !

ఒక సార్వభౌముండు ఓడించి పగతుఱ
ఒకప్రక్క పాలించి యొప్పినాడు
ఒక మహీనాథుండు దికమక నొందించి
ఒక క్రేవ మ్లేచ్ఛారి నుడిపినాడు
ఒక భూమికాంతుండు ఉమ్మలించెను ప్రజ
ఒకచక్కి పోషించి యుపారినాడు
ఒక నరపాలుండు ఉరు శిల్పచాతుర్య
మొక దిక్కు వెలయించి యొదరినాడు

ఒక ధరణిపతి ఈ తెల్గు నుత్కటముగ
నుద్ధరించిరొ ఒక చాయ నొనరినాడు
ఇట్టి నీ తెల్గు దేశంబు ఎడరు జెంది
అడలుచుండె నే డేలకో ఆంధ్రపుత్ర!

# శోకమూర్తి

ఏను విలపింతు రోదింతు ఎడద వ్రీల
నేను ఎలుగెత్తి ఏడ్వ ఘూర్ణిల్లిపోవు
తివిరి సకలదిక్సీమ ప్రతిధ్వనించు
మించు ఝంఝాల రవళితో మేళవించి.

నాది శోకదందహ్యమాన మనము ప్రమ
దప్రసూన సంతానముల్ దందడించి
తాండవింపంగ నిచ్చోట తావులేదు;
లేదు లేదింక మోదంబు నాదు మదికి.

ఇటు కరాళించి వసియించు చావుల వ్యథల
ప్రళయకాల సముత్పన్న భయదశోక
మూర్తి — ఆర్తిచే లోకాలు మూల్గు నేమొ
తిగిచి ఆ మూర్తి నేనె సృష్టించికొందు.

విమల సత్ప్రేమ వీచికల్ వెల్లడించి
తత సుఖానంద జ్యోతికా తతుల నూపి
నా మనోవీధి నర్తించు నవ్యరాజ్ఞి
అగ్గలంబగు మిత్తికి నగ్గమాయె

ఈ మనోజ్ఞ పద్యాలనే ఈసడించు
నా రుచిరమూర్తి బొరసిన భూరి బాధ
గాఢ కష్టసంజాత దుఃఖంబు కవిసి
ఎగసి నా హృదంతరమును ఈడ్చివైచు.

ఈ విషాదాంబుద వితతు లేపు గాంచి
అస్మ దంతరంగంబునన్ అరుగునపుడు
కెరలి నాప్రేమోల వర్తించి మురువు నూపు
నాకమున కేగినట్టి నా నవ్యమూర్తి.

అసాలోహంబును ఏడ్వగా నఖిలమింతు
ఏను గొంతెత్తి పల్మారు—ఈ విశాల
ధారుణీస్థలి ఎవరేని తలకిరేని
నన్ను ఆశ్వాస మొందింప—ఎన్నబోను.

సొగయుచున్నట్టి ఈ సంజ సొగసుదనము
వింతకాంతుల నీను ఈ వితతసంధ్య
సంతరించునె సంతసం బింత అయిన
ఊతుల సౌఃఖ్యాబ్ధి జరియించు నట్టి నాకు.

కందళించెను కమనీయ కౌముదులును
పొటమరించెను తారకా వ్యూహములును
నివ్వటింపంగ జాలునె నెమ్మి సుఖము
ఈ విషాదాహత హృది కిం కీ యదనున ?

నా దురంత సంతాపాన నవసి పోదు—
శోకసంభూత తాపాన స్రుక్కి పోదు—
ప్రతి నిమేషంబు దలపోసి ప్రవినులంపు
మూర్తి నే నాత్మ సుర్వ్యాధన్ మున్గి పోవు

సంతతంబును స్రంతతై జాలు వారు
నిబిడ మలినాశ్రుకణముల నిస్నాపింతు
నిఖిల ధాత్రీతలమ్మును—అఖిల జనులు
ఆత్మ వెఱగంద......

నాది శోకదందహ్యమాన మగు మనము
లేదు—లేదింక శాంతియున్ మోదమేని
నా హృదంతరాళమునకు—
నా ఎడంద
నాచికొన్నది దుర్వార మైన వనట.

# ఉద్వేజనము

మలమల మాడ్చి వేసి భువి
మండిత చండగభస్తి కోటిచే
దలరగ జేసి మర్త్యులను
దద్దయు ఘర్మకణాళి గూర్చి, అం
కిలి యొకింత లేక గోత్రతలము
సంగరు వోవగ సంచరించి యా
జలరుహ బాంధవుండు సన
సాగెను వైళము పశ్చిమాద్రికిన్.

హెచ్చెను సాంధ్యరాగ రుచు
లీ చతురబ్ధి పరీత ధాత్రిపై
జెచ్చెర జంతుజాలములు
సేగుచు నుండె నివాసముల్ మదిన్

మెచ్చుచు సారె సారెకును
మేదిని పైగల శోభ గాంచుచున్
నెచ్చెలు లెల్లరున్ ముదము
నెమ్మది బొందగ నుంటి నొంటిగా

ఆలోకించుచు అభ్రవీధులను నే
నత్యంత హర్షాంబుధీ
జాల్లోలములం జరింప నపుడే
శైలేంద్రవారంబులున్
గాలాకారములం ధరించి ధరపై
గ్రాలంగ నేతెంచె నా
భీలంబై రజనీలలామ పిదపన్
బీజార్థ మొక్కుమ్మడిన్

ఉడుసంఘంబులు దోచి అంబరముపై
నుల్లోకమై యొప్పె నా
ఉడురాజన్యుడు సోముడుం దనరెగా
నుద్వేల దీప్తాళితో;
దొడరెన్ పాండుర కౌముదీచయములున్
దోత్తోన లోకంబునం
దడరెఁ దివ్యమణిప్రకాశితములౌ
హర్మ్యాళియుం బెల్లుగన్

ఆకసముం గనంగ నపు
డాతత శాతము గల్గె నా కొగిన్
ప్రాకుచునుండె వ్యాళములు
రాయుచు ధాత్రి నురస్థలమ్ములన్;

శోకము లెన్నియో కడగి
'శా' యని ధ్యానము సేయుచుండగ
నా కనుమానమే కలిగి
సమ్మోహి నెద్దియొ జూడెద నంచునున్.

*

అంతట నంతంత నే తెంచె అవని కప్పుచు .
ప్రబల ఝుంఝానిలము వృక్ష రాజవితతి
ఊగిపోయెను; దివి గ్రాలుచున్న యట్టి
తారకావళి మబ్బు దొంతరలు నెల్ల
గను వికీర్ణ మవు నని నే గలగిపోయి
వేగ బొందితి నెంతో యుద్వేజనమ్ము.

[2]

పవను ధాటికి మేఘాలు అవిసిపోయి,
అంతరిక్షాన అటునిటు అరుగుచుండి
ధవళ చంద్రికాసంచయాల్ దనర నిచ్చు
ఆ సుధాంశునే నిముసంబు నందు గప్పి
వితత నిబిడాంధకారమ్ము క్షితితలాన
మల్లడింప జేయునో యని మానసాన
గందళింపంగ సాగెను గలత మిన్నుల

*

ఆమ్మహావాత సంచాలితాఖిలభయ
ద ప్రబలతర కంధరతతులు ఎగసి,
విష్ణుపదమున రాజిల్లు వివిధ తార
కాగణంబుల గందోయి కాంచ వీలు

గాని యటులనే క్షణమున వాని గప్పి
తారకాశోభి తాంబర తలమునందు
అఖిల జనమోదహేతువౌ అభ్రమందు
నిబిడనీరంధ్ర తిమిరాల నివ్వటిల్ల
జేయునో అనెడు కలత చెలగె హృదిని.

# ప్రేమమూర్తి

నీవు నా యెద నివ్వటించిన
ఈ వినిర్మల రాగమాలిక
ఈ విషాదపు జీవితమ్మున
కెంత ముద మొసగెన్

ప్రియతర మ్మగు ప్రేమసూక్తుల
నయతరమ్ముగ నవ్యభణితిని
ప్రియతమా యని పిలువ మిగులన్
హృదయ ముప్పొంగెన్

దారుణ మ్మగు దుఃఖసాగర
వార భంగ వ్యూహ మందే
ఘోరయాతన గూలు నా హృది
కూరకే కలిగెన్

దైన్య మందుచు దలరిపోయెడు
మన్యుసంయుతమైన బ్రదుకును
శూన్యగతియే సోకకుండగ
శోభామయ మయ్యెన్

సదయమూర్తీ! యుష్మదంచిత
హృదయ నిర్గత కమ్ర పృథుతర
మృదు వచో నిచయమ్ము లెల్లన్
ముదము గీల్కొల్పెన్

ఏ యనూహ్యాగాధ దుస్తర
తోయధులనో తూలిపోయెడు
నా యనాదృత జీవితమ్మున
నవ్య తార చెలంగెన్.

అస్మదీయ వ్యాకులోద్గత
విస్మయాంబుధి పీడ్య మదికిఁ
నీ స్మితానన మెుక్కటే జగ
మున గోచరించుఁ

మార్గమేమియు మహిని గానక
నిర్గమింపగ వెరవు దోపక
దుర్గమం బని తోట్రుపడగఁ
దోహాలమ్ము నొసగితే!

ప్రేమమూర్తీ! ప్రమద మొలుకఁ
నీ మనోహర నిర్మలోజ్జ్వల
ప్రేమభాసిత దృష్టి బరుపఁ
ఈ మనం బలరేఁ.

ప్రళయకాలానంతాభీల
చలిత జీమూతవ్రాతముల్
కలచియాడిన విశ్వ మెల్లన్
చెలియ నిను మఱతునా !

*

లోకమే తలక్రిందులై
చీకాకు జెందినా,
సర్వసర్వంసహా
చక్రమ్మె కంపించినా,

ఫుల్లపత్రేక్షణా !
ఉల్లసితవదనా !

మించు దీప్తుల నించు
చంచలించెడు నీ దృ
గంచలంబుల నేను
కాంచుచుౘ కాంచుచుౘ

జరియింప నాశింతు...
వరలంగ నాశింతు...

# రాజ్ఞీ దుర్గావతీదేవి

భుజదర్పంబున వైరివీరులను
నిర్మూలింపగా నేర్చి నీ
వె జగానన్ బుధవర్గ మెల్లయును నె
వ్వేళన్ హృదిన్ మెచ్చగా;
నిజశౌర్యానల కీలికావితతులున్
నిండార క్ష్మామండలిన్
సృజియింపంగ గడంగి రాజ్యరమనున్
జెన్నారు చున్నప్పుడున్

భవదీయాభ్యుదయంబు నున్నతియునున్
భవ్యోరు విక్రాంతియున్
భువనైకాహత తీక్ష్ణ తేజ తత వి
స్ఫూర్తిచ్ఛటానీకమున్

అవమానంబు ఘటింపగా మిగుల నా
అక్బర్ మదిం గుంది వే
గవియంతే నిజసైన్య సంహాతులతో
గావింప సంగ్రామమున్ !

చతురంభోధి పరీత విస్తృత భువి
సంవాసిత క్షత్రియుల్
తతశౌర్యాఢ్యులు గొల్చు నా ప్రభువునే
తాకంగ గ్రోధాత్మవై
స్మితసంశోభిత ఫుల్లచారు ముఖ రో
చిర్వాతముల్ గీడ్పడన్
ధృతి పెంపొందగ ఏగినావె అనికిన్
నీరేజ పత్రేక్షణా !

అది మహాభీలతుములరణాంగణమ్ము;
క్రూర కరవాల దుర్వార ఘోరధార
కతన వీరభట గ్రీవగణ వినిర్గ
త రుధిరము జారి ఏరులై ఉరువడించి
ఆశ లెల్లెడ బ్రవహించె దేశమంచు.

*

ఆ రణరంగమా కడు భ
యావహ మైనది—ప్రత్యహంబునున్
బోరుచు దేహముల్ దొరగి
మ్రూల్గుచు బోవుచునుండ నెందరో
ధీరులు నాకముం గనగ,
దిట్టతనంబున సేన జొచ్చి నీ
బీరము లావునున్ దెలియ
భీతికృ దూర్జిత రూప మొప్పగన్

రణసీమన్ వడి జొచ్చి ఈవు పృథుదో
ర్దర్పంబు నేపారగన్
ఘనకోపానలజాత విస్ఫుట శిఖా
ఘంబుల్ నభంబున్ గలం
ప నరాతిశ్చయముల్ వడంక గడు శుం
భ ద్వేగ సంరంభవై
అని సేయంగ నుపక్రమించితి గదా
'ఆహా' యనన్ లోకముల్.

సలలిత గండభాగచయ
సంజనితస్ఫుట దీధితీ తతుల్
విలసిత దీర్ఘ ఖడ్గ రుచి
వేష్టిత భీకర సంగరావనిఀ

మలయుచు నుండగా గరము

  భ్రాన్పడి పోయిన వైరిసేనలున్

గలగి తొలంగి పారగను

  గ్రాలితి తద్దయు ఘోరమూర్తితోన్

ఆ రీతిన్ ప్రధనంబు జల్పి అపుడే

  ఆ మ్లేచ్ఛ సైన్యావళిన్

ఘోరావారము గంధవాహుడు గలం

  పం జాలు చందమ్మునన్

ధీరస్వాంతవు సాటచే దునుముచున్

  దీపించినా వీవు; ప్ర

స్ఫారోద్దామ యశంబు గల్గ బిదపన్

  బ్రాణాల గోల్పోయితే!

జలధివలయిత ధారుణీతలము నెల్ల
గడగి శాసించు సార్వభౌము డత డమిత
బలుడు; అట్టివానిని నీవు గలచియాడి,
భయదజన్యాన తనువును బాసి మహిత
దివ్య కీర్తిచంద్రికలు ఈ దిక్కు లెల్ల
నిండ, రాజ్ఞి దుర్గావతీ! నీవు నెగడి
తమ్మ; అల్లదే నీ కీర్తి నఖిల ప్రకృతి
మంజు శారికా పరభృత మధుకరచయ
మేదుర మధుర గానాల మేళవించి
తివిరి అహరహమ్ము నిల బ్రతిధ్వనించు.

రాజ్ఞి వయ్యును సంత్రాస రహితవగుచు,
వెలది వయ్యును నీవు నిర్భీత వగుచు,

సార్వభౌము నెమర్చుట సాహసంబు
గాదొ? దుర్గావతీ! కాంచు నీదు యశము
నాలపించుచు జోహారు లవిగొ తెలుగు
మగువ లర్పించు చున్నారు మమతతోడ.

# కృషీవలుడు

ధారుణి సర్వజంతుతతి
తద్దయు గాఢసుషుప్తి నుండగన్
ఘోరున శీతవాయువులు
భూధర పంక్తులు తల్లడిల్లగా
దారుణలీల వీవగ ము
దావహ చిత్తుడవై పొలంబునున్
జేరుచునుందు ప్రత్యుషసు
చెంగలిఋంపక యున్న పూర్వమే
కీరుతు లెల్ల నెల్లెడల
గీల్కొనుచుండగ గర్షకోత్తమా!

అది చలివేళయే అగును
అంబుద మంబర మందు నెందునున్

గడలేడు భంగి ద్రోపదు జ
గంబు నిజంబుగ జెందు నిద్ర యే
చెదరిన మబ్బుతున్కలో వ
సింపగ దుంగమహీధరాల శృం
గ దరుల జేరు తారకలు
గాత్రిలు నభాన గళావిహీనతన్
ముద మెద జెందుచున్ బోలము
బోయెడు వేళను కర్షకాగ్రణీ!

అది కడు భీకరం బయిన
యామిని గర్కశచిత్తు నేనియున్
మది దలకింప జేయదగు
మల్లడిగొన్ బెనుజీకటుల్ భువిన్

గమనము మనుంపు ద్రాసమున
గంపితులై చనుచుండ జోరులున్
ముద మొద జెంపుచున్ బొలము
బోయెద వీ వెపుమున్ గృషీవలా!

జలరుహబాంధవుండు నిజ
చండమయూఖ పరంపరావళీ
విలసిత తేజసంహతుల
విష్ణుపదమ్మున నుల్లసిల్లగన్
దలరక; జాతఘర్మ తత
ధారలు వ్రంతలు వ్రంత లౌచు నీ
ఇలపయి జార బాటుపడె
దీవు సతంబును గర్షకోత్తమా!

కలిగిన వార లెల్ల గల
కాలము కాయము బెంచి కొంచు నే.
కలతయు లేక శాతము సు
ఖంబు కరంబును పంబుచుండగా
గలుగు కొలంది మెక్కి దమ
కాంచన శోభిత సౌధ పంక్తులన్
జెలగుచు నుండ నీ వెపుడు
జేతమునం బుయిలోట లేక యే
తలిరుచు నీ పొలాన నతి
దక్షత పాటు బడంగ నేర్తు వే!

*　　*　　*

లోకాల నెల్లను జీకాకు నొందించు
దుర్భరశ్వాసనుండు దొడరు నపుడు;
జంతుజాలము నెల్ల స్తంభింపగా జేయు
పృథుల వర్షంబులుగ వెలయు నపుడు;
తీండ్రించి మెండుగా చండదీధితులతో
భానుండు గగనాన బరగు నపుడు;
మిన్నును మన్నును గన్ను కగోచరం
బగుభంగి హిమముచే నెగడు నపుడు;

నిట్టలంబగు నింకెట్టి బెట్టిదంపు
టిడుమలే నివ్వటిల్లిన నెలమి నుల్ల
మొల్లయును బల్లవింపగా నెల్ల కాల
ము శ్రమపడు కర్షకా! ఈవెపో ఘనుడవు.

అదియు నొక వ్యర్థమైనట్టి అవని యగును
నిన్న మొన్నటి దాకను—నే డదిభవ
దీయ కష్టసమార్జిత దివ్యసస్య
సస్యరమచే గుబాళించి సరవి సొగయు
చున్నది గదా కృషీవలా! ఉత్కటముగ—
మానసింపంగ నీవెపో మాన్యుడ విల!

# అదృష్టవతి

నీ వొక నూత్న రత్నతతి
నెమ్మి నథఃకరియింప నేర్చు సం
భావితమూర్తి దీపితవు
భాసిత దివ్యతనూవిలాస బం
ధావిల సోము డీ యెడ భ
యావహులు డౌచు గలంగు; నీ కడ
ప్రోవులు ప్రోవులైనవి య
పూర్వ విశంకట సద్గుణావళుల్.

ఓ రుచిరాస్యబింబ విభ
వోజ్జ్వల ఏ తొలిజన్మమందు ఇం
పార నొనర్చినావొ గద
అత్యధికప్రమదంబు ప్రబ్బగా

గూరిమి సత్క్రియావితతి

కోమల మంజుహృదంతరమ్ముతోఁ;

జారుతరస్థితిఁ వితత

సౌఖ్యము నివ్వటిలంగ నే డిటుల్ !

ఈ తరళాభ్ర సీమల న

హీన రయంబున బర్వు గుంపులై

ఈ తెలిమబ్బు దొంతరల

నెన్నగ గాంచుచు నుందు మేము; ఏ

వో తలపింపరాని వివి

ధోత్కట బంధుర కశ్మలచ్ఛటల్;

ఆతత శాత మర్త్య భవ

దచ్ఛగుణావళి గాంచ నీయెడఁ

నే నొకనాడు దివ్యతర
నిర్మల సౌఖ్య పయోధి వీచిక౯
దానము లాడి కాలవశ
త౯ బడిపోవ విషాద సింధుసం
తాన కరాళ శంబర వి
తానములం దయ నెక్కొనంగ నీ
మానసమందు న న్నపుడు
మానుగ నూరట బుచ్చ నేర్చితే
కానము భూతలాన నిక
గామినుల౯ నిను బోలు వారిని౯.

ఏమీ భవదీయాస్తో
కామల సౌందర్య వైభవాంచిత రోచీ

ప్రత్యగ్ర శాఖాగ్ర
పరిఫుల్ల వల్లరీ
తత దీధితీ భాసి
త నికుంజ పుంజాలలో

అత్యంత సంప్రీతి
అడ్డాడు సారంగ
సంఘాత సన్నిధిగ
సంచార మొనరింతునా?
సంతతమ్మును?— లేక

దుర్దాంత కౌటిల్య
దుస్సహ హృద్వ్యాప్తి
సంభరిత మనుజ
సహవాసమే సేతునా?

తుంగ గోత్రేంద్రముల్
త్రుళ్లింత లొందంగ—
బహుళ సాంద్రద్రుమ
వ్రాత పత్రాళిలో

మధుర గానమ్ములన్
మాటిమాటికి చాడు
ఆ పరభృతమునే
అనుసరింతునా ?—లేక

దుర్భ రోద్వేల మ
దోన్మత్త మానుష
వక్త్ర ప్రభూతోత్కట
పరుష వచోనిచ
యాహతిన్ అవిసిపోనా ?

సద్యో సముత్ఫుల్ల
శశ్వ త్సుమ శ్రేణి
నెత్తావి నల్లెడన్
నెఱపి గుబాళింప,

సొగయు చున్నట్టి యీ
సురుచిర కాసార
వార ప్రతీరాల
వాసమ్ము సేతునా?
లేక——

వివిధ జనావాస
వితత వ్యధాకలిత
స్థానీయ మందిరాం
తరమందె తపియింతునా ?

# సంప్రశ్నము

నగు మొగం బది బాలికా నవసె నేమి?
దీప్తి తఱిగెడు భవదీయ దివ్య కమ్ర
వదన సంభూతవిస్ఫూర్తి; మది దలంచి
తేమొ! జీర్ణాంధ్ర సౌభాగ్య మిపుడు నీవు
దందడింప విస్మయము హృదంతరాన.

విచ్చుకత్తుల చేబూని వీక నెఱపి
భయద సంగ్రామరంగాన బరబలమ్ము
బాపురే యని విభ్రాంతి బడసి మడియ
బరిభవించిన రాజ్ఞీనికరము లకట
కాల గర్భాన బడిపోవ గలిగితేమొ!

పూజ్యసామ్రాజ్య సంప్రాప్త మోదభరిత
వివిధ ధారుణీపాలక విశ్రుతంపు

టమల కీర్తి సంహతులె ఈ అవని మలయ
నేడు—మానసమ్ము గలచి యాడె నేమి
గాఢతర విషాదాగాధ బాధవనధి?

ఇది యనేకాబ్దముల్ ధాత్రి నెల్ల నేర్పు
మీర శాసించినది సుమ్ము—ఘోరనిర్ఘృతి
పావకాభీల కీలికల్ ప్రబల మగుడు—
కార్చు చుంటివె మలినాశ్రు కణము లీవు?
కాల మొకరీతిగా నుండ గలదె చెపుమ!

# ప్రేమ తత్త్వము

[షెల్లీ గీతానికి తెలుగు]

వడిగ బరువిడు నిర్ఝరవార మెల్ల
కలియు నేమిా తరంగిణీ సలిలములను ?
మధుర శంబర పరిపూర్ణ మంజువాహి
నీ వితతు లీ గభీర వార్నిధివితాన
భూరి గర్భాన విశ్రాంతి బొందు నేమి ?

మఱియు నా నాకలోకాన మలయు చున్న
మృదుల పృషదశ్వసంహతుల్ మిళిత మవును
ఏ సుమధుర భావాలనో ఏరి కెఱుక? —

*

ఈ విశాలవిశ్వంభర నేది గలదు
తలప నేకాంతవాసమ్ము సలుపు జీవి?

ఆ పరాత్పరుని సుశాసనానుసార
సరణి అన్నియు నొక దివ్యశక్తి లోన
లీనమై చరియింపవే!

కాన, నేను

నిన్ను గవయ నింకేల యత్నింపరాదు?

*

ఈ మహోన్నత శృంగముల్ ఎగసి ఎగసి
త్రిదివలోకమ్ము డాకెడు ముద మెసంగ;
తుంగ భంగసంఘమ్ములు తొడరి సతము
ముద్దుగొను పరస్పరమును మోద మొదవ.

నవ్య సుమ మొండు భ్రాతృసూనమ్ము ధిక్క
రింప గడగిన— దాని గణింప రెవరు.

ప్రజ్వలిత భానుసంజాత బహుళ తరళ
శోచు లీ భువి సంశ్లేష సుఖము బొరసి
అడరు చున్నవి పెల్లుగ— అవిగో, కనుము!

ఈ నవోదిత హిమధాము మేని నుండి
నిర్గమించిన కౌముదీనివహములును
పొంగి పొరలెడు సంద్రము ముద్దు గొనెడు

*

సకియ! భవదీయ పరిరంభ సౌఖ్య మొసగ
వేని—
ఈ దృశ్యముల కేమి విలువ గలదు?

# సందేశము

ఖరకరుడుం బశ్చిమ భూ
ధర శిఖరముపై కరుగగ దల్లడపడుచున్
ధరణీతల సంవాసిత
పురుషుల్ నిజవాసములకు బోవుచునుండన్

సంజ కెంజాయ నునుగాంతి సరవి గనుచు
విమల కృష్ణాతరంగిణీ విపుల భంగ
సంఘ సంభూత వాతంబు సౌఖ్య మెలమి
నివ్వటిల జేయ గూర్చుంటి నీటి చెంత.

నా చిత్తంబున కెంతయో ముదము గ
ల్గన్ ద్యోతలంబందునన్
దోచెన్ శీతకరుండు నా యుడుగణో
ద్యోతిన్ విభాసిల్లుచున్;

వాచాలం బయె నంతల్లో మిగుల ద
త్ర్వాంతంబునం బర్వ నా
వీచీసంయుత దీప్త నిమ్నగ మహో
విస్తార తోయంబునన్.

ధ్వాన మాకీతి గదుగంగ దల్లడిలితి
సాధ్వసమ్మున నురియాడు స్వాంత మపుడు
త్రాసరహితమ్ము గావించి తలకి నేను
ఓజ శిర మెత్తి వీక్షించు చుండు నంత—

తరుణ సుధాంశు బింబము న
ధఃకరియించెడు ఆస్యసీమపై
వరలెడు కాంతి పుంజములు
వాసిని ఎంతయు బాయుచుండగన్

దొరగిన బాష్పబిందువులు
తొంగలి రెప్పల నప్పళింపగన్
ఊరువడి నేగుదెంచె నొక
యుత్పలలోచన నాదు చెంతకున్.

కన్నుల గారు నశ్రువులు
కాల్వలు గట్టుచు నగ్గలంబుగా
దిన్నగ జారుచున్ బడగ
ద్వీపవతీ తత శంబరంబునన్
సన్నని మంజులాంబరము
ఛాయ దొలంగుచు నుండ; ఇంతి చే
సన్నలుచేసి పిల్చె నను,
చయ్యన నే నపు డామె వెంటనే

చని చని చేరిరిన్ గడు వి
శాల ధరాతల మొక్క దానినిన్
ఘనతర కాననావళులు
క్ష్మాధర పంక్తులు నిస్తరించి, నూ
తన రుచిజాల విస్ఫురిత
ధామ నిధానము నా ప్రదేశమున్
గనుగొని రామ యిట్లు పలు
కంగ దొడంగెను దొట్రుపాటునన్

నూతన దేశవాసు లిట
నూలుకొనంగ గడంగి యల్లనన్
జాతిని నంతయున్ దమ వ
శం బొనగూరిచి శేముషీ విశే

పాతత ధైర్య సంపదలు
నచ్చెరువుం ఘటియింప దేశముఁ
బ్రీతిగ నేలుకొంచు గట
బిడ్డల వంతల పాలు సేయ రే!

తిన నొక యింత యేనియు క్షి
తిం గనరాదు గదా, కృశించి నా
తనయులు నెల్లరుఁ సతము
దద్దయు భూరి విచార వార్నిధిన్
మునుకలు వేయుచుండి రిట
ఫుల్లసరోరుహ చారునేత్రుడా!
మనమున బొందు పెట్టు లిక
మానుగ శాతము నెంచి చూడగఁ?

మాన్యుల బూజ్యులన్ గలిగి
మానధనమ్మున సాటి లేనిదై
మాన్యత నెంతయుం దనరె
మామక దేశము మిక్కుటమ్ముగా;
దైన్యము జెంది నే డకట
దారుణ ఘోర దురంత తాపమై
శూన్య సమస్త భాగ్య యయి
సొక్కుచు సోలుచు స్రుక్కిపోయెహః

గురు జన్యావళి వైరివారమును సం
క్షోభింపగా నేర్చి ని
వ్వెఱగందన్ మును శత్రుభూధవులు నీ
విస్తార ఖండంబునన్

బరిపాలించిన హైందవప్రభుల ప్ర
స్ఫార ద్భుజాదర్పమున్
బరికింపంగను జాలినట్టి గిరులే
వాపోయి బిట్టేడ్చెడున్.

ఘన లక్ష్మీయుత భాసితం బగుచునున్
గళ్యాణ వంతంబునై
జనసందోహ మనూన సౌఖ్య గరిమా
శాంతాంబుధి స్ఫీత ని
స్వానకల్లోల విహారముం గడు నోన
ర్పంగా విలోకించు ప్రా
దిని నేత్రాంబుజ యుగ్మ మక్కట ఇటుల్
దీనత్వ మొందెన్ గదా!

ఈ మహోన్నత వృక్షాలు, ఈ విశాల
సాల సందీప్త నీరంధ్ర సాంద్ర గహన
తతులు తమ దేశ సౌఖ్యాళి దలచి తలచి
వ్యాప్తి నొందెడు నిర్వృతికి వగచి వగచి
కార్చు మలినాశ్రుకణములు కనుల వెంట.

అనుచు గన్గవ గన్నీరు అడర బలికె
నామె—పారతంత్ర్యాత్మకం బైన యట్టి
దేశమున స్వేచ్ఛ వెలయించి దీనజనుల
గావ యత్నింపు - యత్నింపు కనికరమున.

తల్లడిల్లు నా యుల్లంబు దలరిపోవ,
పల్లటిల్లు నా ఆస్యంబు ప్రభలు వాయ,

అశ్రుకణ పూరితంబయ్యె అక్షు లపుడె
మిగుల – అయ్యెను బిదప నిమీలితంబు.

సకల విపులోరు కకుబంత సంతతులను
దివ్య విభ్రాజి తోత్తుంగ నవ్యభవ్య
నిజ తనూద్భూత విస్ఫూర్తి నిష్నావింప
పార్శ్వభాగాన దీపించు ప్రవిమలంపు
మూర్తి అంతర్హితం బయ్యె ఆర్తి జెంది
లోచనములను విప్పి నే జూచు నంత—

అప్పు డూహించితిని నేను ఆమె భారత
తాంబ యని—ఆమె హర్షంబు పంబ జేయ
నాటినుండి యా ధరియించినాను కేల
గంకణం బొండు దేశంబు గావ దలచి.

నాది యొక కశ్మలచ్ఛటా కలిత కఠిన
కలుష హృదయమ్ము లవమేని కానరాదు
పరమ దాక్షిణ్య మిచ్చోట—ప్రమద మతిని
యత్న మొనరింప నైతిని అహరహమ్ము
దు_స్తర దురంత దుర్వ్యథా దూలిపోవు
నా సహోదర వర్గమ్ము నవయకుండ—

తరళ ధావళ్య తారకా తతుల కతన,
వరలు నూనూత్న కౌముదీ ప్రభల కతన,
ఆ విశాలతర మహా విహాయసమ్ము
నిఖిల జనమోద హేతువై నెగడు గాదె?

అటులె, ఆ ప్రబోధమ్ముచే అస్మ దంత
రంగమం దెద్దియో మార్పు చెంగలించె

పరమ కారుణ్య వాహినీ వార ధార
కవిసి నా మనస్సీమను గలచి వైచె.

కీలుకొన్నది ఆ మూర్తి జాలిగొలుపు
వచన నిచయంబు స్వాంతాన బదిలముగను;
బాదుకొన్నది యా మూర్తి భాసితంపు
టమల ముఖబింబమును నా హృదంతరాన.

ఇస్సిరో ఇంక నేటికి ఏను బ్రదికి
దుర్భర వ్యథా బాధలే తొడరి తొడరి
కఠిన దాస్య బంధమ్ములే కవిసి కవిసి
భ్రాతృవర్గమ్ము దేశమ్ము బాధ పెట్ట.

అనుచున్ శపథము నొకదా
నిని గావించితి పదపడి నిర్మలమతినై

ఘనతర కష్టాంభోరా
శిని బడి నకనక బడియెడు శిష్యుల బ్రోవన్.

ఇదియు నా పూజ్య దేశమ్ము ఎద దలంప,
వీరు నా సోదరుల్ గద—వీరి నుద్ధ
రింపగాలేని బ్రదు కది పృథ్వి వ్యర్థ
మగును గాదె నిక్కమ్ముగా నరసి చూడ—

*

మింట నొక తార యొంటిగా మెఱయుచుండె
నికట తరుపుంజ మందు స్వనించుచుండె
నెద్దియో యనూహ్యగీత—మీ యపార్థ
నూత్న సందేశమే మది నూలుకొనియె.

అంత నా ప్రశాంత రజనీకాంత స్వాంత
పథమునం గడు శాంతమున్ బదిలపఱచె
భవ్య సందీప్త భావనల్ బరిఢవిలగ.

*

ఆ సుధాధామ కమనీయ యామినీ స
మయ సముత్పన్న సమ్మోద మనము తోడ
అరుగుచుంటిని వేవేగ తిరిగి—ఆ సు
ధా మధుర వాక్కులే హృది దండడించె.

# తలపులు